## ప. ప. వ. నిజాంస్టేటు రైల్వే

### నోటీసు

నిజామాబాదు - బోధన్ సెక్షన్‌లో రైళ్ల కాలముల మార్పులు

15 నవంబర్ 1943 సోమవారమునాటి నుండి నెం. 49, 50, 51, మరియు 52 మిక్సుడు రైళ్లు ఈక్రింది కాలముల మార్పుతో నడచును.

| | | | |
|---|---|---|---|
| | | 50 మిక్సడ్ | 52 మిక్సడ్ |
| నిజామాబాదు | పోక | 06-00 | 17-43 |
| బోధన్ | రాక | 08-10 | 19-45 |
| | | 49 మిక్సడ్ | 51 మిక్సడ్ |
| బోధన్ | పోక | 08 50 | 20-25 |
| నిజామాబాదు | రాక | 10-45 | 22-25 |

పూర్తి రాకపోకల కాలములకు స్టేషన్లలోని పెద్ద టైంటేబిల్లు చూడుడు.

సికింద్రాబాదు - దక్కన్
తేది 12-11-1943

ఆర్. హైదరీ
ఆ. చీఫ్‌ట్రాన్స్పో. సూపరింటెండెంటు

## పెషావర్ యక్స్‌ప్రెస్ ఉపద్రవపు అభియోగం తీర్పు

జాల్నాపూర్ సెషన్సుజడ్జి ఏ.ఆర్. ఖాన్ గారు పెషావర్ యక్స్‌ప్రెస్ బండిపట్టాలనుండి తొలగి క్రిందపడి ఉపద్రవము జరుగుటనుగురించి తమవద్ద నడిపించబడిన అభియోగములో నవంబరు ౧౦ తేదీన తీర్పు చెప్పిరి. జూరీవారు ఏకగ్రీవంగా ఈ అభియోగమంతటిలో నిందితులు నిర్దోషులని అభిప్రాయమీయగా, జడ్జిగారు దానిని అంగీకరించి అందరునిందితులను వదలిపెట్టుటకు ఆజ్ఞనిచ్చిరి.

పోయిన సంవత్సరము అక్టోబరు ౨వ తేది 3వ తేదీల మధ్యరాత్రివేళ పెషావరుకు పోవుచుండిన యక్స్‌ప్రెస్సు బండి చాలిస్గాంపూర్ వద్ద పట్టాలనుండి తొలగుటచే గరమంది ప్రయాణీకులు వెంటనే మరణించిరనియు, ౪౦ మందికిపైగా గాయపడిరనియు, ఆపట్టాలను నిందితులు తొలగింపుటచేతనే ఈ ఉపద్రవము జరిగెననియు, నిందితులు దరుసు రాజకీయ విధ్వంసకార్యక్రమమునందు ఒక భాగముగ ఈదుష్కృత్యము జరుపుటకు ప్రభుత్వముపై కుట్రచేసిరనియు నిందితులపై ఆరోపణలు అభియోగమందు చేయబడినవి.

నిందితులు తమకు కాంగ్రెసుతో సంబంధము లేదనియు, తామాతప్పులసంగతి ఎరుగమని చెప్పిరి.

జడ్జిగారుకూడ రైలుపట్టాలను నిందితులే తొలగించిరనుటకు సాక్ష్యము లేదనియు, పోలీసులవద్ద నిందితులు ఒప్పుకొన్నట్లు తెలుపబడిన సంగతులను నిందితులు నిజముగా ఒప్పుకొనినట్లుగా భావించ వీలు లేకున్నదనియు అభిప్రాయపడిరి.

